# అంగుళమంత బుడ్డోడు

రచన: అకీమీ, బొమ్మలు: మెగ్యుమీ



అనువాదం: కె. సురేష్

చాలా రోజుల నాటి సంగతి. జపానులో ఒక వృద్ధ దంపతులు ఉండేవాళ్లు. వాళ్ల జీవితం చాలా హాయిగా గడిచిపోతోంది. అయితే పిల్లలు లేరన్న చింత ఒక్కటే వాళ్లకి ఉండేది.



పగలంతా వాళ్లు పొలంలో పని చేసే వాళ్లు.

రాత్రి అయిన తరవాత ఇలా కోరుకునేవాళ్లు:

“మెరిసే తారల్లారా!

మా కోరిక తీరుస్తారా!

పండంటి బిడ్డను మాకు ఇవ్వరా."



ఒక రోజు వాళ్లు పొలంలో నడుస్తుంటే ఒక చిన్న పిల్లవాడి ఏడుపు వినిపించింది. ఆ శబ్దం ఎక్కడి నుంచి వస్తోందా అని వాళ్లు నలువైపులా చూశారు. చివరికి వాళ్లకి గడ్డిలో ఒక చిన్న పిల్లవాడు కనిపించాడు.



తమ కోరిక తీరినందుకు భార్యా-భర్తలు చాలా సంతోషించారు.



ఆ పిల్లవాడిని ఇంటికి తీసుకుని వెళ్లి అల్లారుముద్దుగా పెంచుకోసాగారు. సంవత్సరాలు గడుస్తున్నాయి. పిల్లవాడు సంతోషంగా ఉన్నాడు. అయితే, అతడు ఎత్తు మాత్రం పెరగలేదు. అతడి ఎత్తు అంగుళం మాత్రమే.



ఆ పిల్లవాడిని అందరూ 'అంగుళమంత బుడ్డోడు' అని పిలిచేవారు. మిగిలిన వాళ్లతో పోలిస్తే అతడు చాలా తేడాగా ఉంటాడు. అయినా అతడిని అందరూ ఎంతో ప్రేమించేవాళ్లు.



అంగుళమంత బుడ్డోడు ఒక రోజు పట్టణం వెళ్లాడు. ఉన్నట్టుండి చాలా పెద్ద శబ్దం వినిపించింది. ఆ శబ్దం ఎక్కడినుంచి వస్తోందా అని అతడు అన్నివైపులా చూశాడు.



అప్పుడు అతడికి ఒక జీవి కనిపించింది.

అంత పెద్ద జీవిని అంతకు ముందు ఎవ్వరూ చూడలేదు. దానిని చూస్తూనే అందరూ పరిగెత్తసాగారు. అక్కడ అంగుళమంత బుడ్డోడు మాత్రమే మిగిలాడు.



నగరాన్ని రక్షించాలని అంగుళమంత బుడ్డోడు అనుకున్నాడు. అతడు పరిగెత్తుకుంటూ వెళ్లి బట్టలు కుట్టే దుకాణం నుంచి ఒక దారపు బంతిని తీసుకుని వచ్చాడు. ఆ తరవాత ఆ పెద్ద జీవి దగ్గరకి వెళ్లాడు.



చాలా చిన్నవాడు కాబట్టి అంగుళమంత బుడ్డోడు ఆ జీవి కంటపడకుండా దాని దగ్గరకల్లా వెళ్లాడు. ఆ దారం తీసుకుని ఆ జీవి కాళ్ల చుట్టూ తిరుగుతూ దానిని బంధించసాగాడు. చివరికి ఆ పనిలో సఫలం అయ్యాడు.



తరవాత తన బలాన్నంతా ఉపయోగించి తాడుని లాగాడు. దాంతో ఆ జీవి దభేలుమంటూ కింద పడింది. ఆ జీవి తల ఎత్తి అంగుళమంత బుడ్డోడిని చూసింది.



“నా కాళ్లని ఎందుకు కట్టేశావు?" ఆ జీవి అడిగింది.

“నీ నుంచి నగరాన్ని కాపాడాలి," అంగుళమంత బుడ్డోడు చెప్పాడు.



ఆ జీవి చాలా బాధపడింది. “నేను మంచిదానిని. నేను ఎవరికీ హాని చెయ్యను," అని ఆ జీవి చెప్పింది.

అదంతా విని అంగుళమంత బుడ్డోడు ఆలోచనలో పడ్డాడు. ఆ జీవి చాలా తేడాగా ఉన్నట్టే అతడు కూడా చాలా తేడాగా ఉంటాడు. ఆ తరవాత ఆ జీవి కట్లను ఊడదీశాడు.



అప్పటినుంచి అంగుళమంత బుడ్డోడు, పెద్ద వింత జీవి, వృద్ధ దంపతులు, పట్టణవాసులు అంతా సంతోషంగా ఉన్నారు.



